# విభూతి

సంపాదకులు

పండిత చిదిరెమఠము వీరభద్రశర్మగారు

సారస్వత ధార్మిక మాసపత్రిక



పుండ్రము ౩ శా ౧౮౬౩ వృష – మాఘం. శికింద్రాబాద్ రేఖ ౭

**Vol. 3.** **25th January, 1942** **No. 7**

**SECUNDERABAD**

సం॥ర చందా ౨-౮-౦

విడి సంచిక ౦-౪-౦

# విభూతి - విషయసూచిక

వృష - మాఘం




సారస్వత ధార్మిక మాసపత్రిక

పుంద్రము ౩ Vol. 3 | శా ౧౮౬౩ వృష, మాఘము — సికింద్రాబాద్ 25th January 1942-Secunderabad | రేఖ ౭ No. 7

# ఆంధ్రదీక్ష

## విద్వాన్ శ్రీ మేడిపల్లి లక్ష్మీకాంతంగారు

అదిగదా కవనంబు! ఆంధ్రవిజ్ఞాన చం,ద్రికల దిగ్వలయంబు తెనుఁగునేత,
అదిగదా కవనంబు! ఆంధ్రపౌరుషశౌర్య, ధైర్యసాహస మహోద్ధతి నుడువుట,
అదిగదా కవనంబు! ఆంధ్రలలితకళా, చిత్రవైదుష్య విచిత్రితంబు,
అదిగదా కవనంబు! ఆంధ్రజాతిని మొద్దు,నిద్దురనుండి కన్దెరపు గీతి,
అట్టి కవనంబు నా కుపాస్యంబు నేఁడు, ఆంధ్రమకుటంబు మరల మహాంధ్రజనుల
శీర్షముల వెల్గ నందాక చేయిజార్చ, ఖరతరాఖీల పరభేద కవనధాటి.

ప్రతి భారతీయుని భావంబులోన నే, పదములు జపియింపఁబడును సతము
భారతవీరు లే పదమును రక్షింప, శూరులై స్వర్గంబు చూఱఁగొనిరొ,
భారతావని దేనిఁ బడయంగ నేఁటికి, వీరప్రసూతయై వెలయుచుండు
భారతకవి యేమి పాడు సావేరిని, మేలుకో! మేలుకో!! మేలుకో య
టంచు—అట్టి దివ్యపదవిహారిని, సుఖ,దాయిని, సుహాసిని, జనని, హాయిమీరఁ
బాలనము సేయుగాత! నా ప్రజల, నాదు, దేశమును సుభిక్షముగ సుస్థిరముగాను.

# తారతమ్యము : సుఖ దుఃఖములు

శ్రీ అయితంరాజు కొండలరావుగారు

ఈశ్వరసృష్టిని బరిశీలనబుద్ధితో నవలోకించువారి దృష్టినిప్రప్రథమమున నవరోధించునది యందలి వైచిత్ర్యము. అయ్యది మానవునకు జూడంజూడ నెంతయు హృదయరంజకముగ నుండుననుట నిర్వివాదాంశము. గైరికాది ధాతుజరోచి స్తోమరాజితంబు లగు పర్వతరాజంబుల పరిమాణాది వివిధవ్యత్యాసములును, నానావర్ణ పర్ణపుష్ప ఫల పరిశోభితంబు లగు వనస్పతులలోని తరుగుల్మలతాదుల పెక్కు చందంబులును, వాయువ్యారణ్యగ్రామ్యాది ఖగమృగ పశ్వాదుల పలుతెఱంగులును, దర్శన మాత్రమున నీశ్వరుని యనంత సామర్థ్యమును బ్రకటించుచు గుణగ్రహణపారీణుం డగు మానవుని మానసమున గౌరవాదరసత్కారాది సద్భావ పరంపర సంకురింపజేయుచు నీశ్వరైశ్వర్య విశ్వాసమును బలపరచు ననుటకు సందియ మేమి? ఈమేరకు మానవుడు సహృదయుడుగనే వర్తింపగలుగును.

కాని స్వయముగ మానవజాతియందలి వైవిధ్యమును బరికించుచో గోచరించు స్థితిగతుల నిమ్నోన్నతములును, జీవనపద్ధతుల వ్యత్యాసములును, కలిమిలేముల తారతమ్యములును హృదయమున నచ్చుపడ దోచుటయు సాహచర్యసంబంధమువలన మానవజాతియందలి వైచిత్ర్యము వారి సుఖదుఃఖ వైషమ్యమునకు ముఖ్యకారణము అను విశ్వాసము వెన్నతోడన పెట్టబడిన దగుటంజేసి అట్టితలంపు రజ్జుసర్పభ్రాంతివలె మానవుని హృదయసీమ నావహిల్లును. అది మానవేతరభూతములందు గానవచ్చినపుడు ఎంతయో హృదయరంజకము దోచిన ఈ వైచిత్ర్యమే ప్రస్తుతము మానవవ్యక్తులయందు గానవచ్చినప్పుడు అంత హృదయరంజకముగ నుండకపోవుటయేగాక హృదయభంజకముగా గూడ మారిపోవును. తోడనే మానవుడు తా నింతవరకును గనుపరచిన గుణగ్రహణపారీణత యూడనిబాడును. ఈశ్వరునియందలి గౌరవాదరాది సద్భావంబులు తావులు దప్పును. ఆయన దయామయత్వమందలి విశ్వాసంబును విలోలంబగును. ధైర్యము పాదు గదలును. దైన్య మావరించును. నైరాశ్యాంధకారము గ్రమ్ముకొనును. ఈ కలవరములో వివేకము నిర్గమనము బెట్టుకొనును. ఇట్టి దెసమాలిన స్థితిలో మానవుడు దూలిపోవ సిద్ధముగా నుండును. ఇట్లు దుస్థితిలో నున్నవానికి పరిపూర్ణాపరోక్షజ్ఞాన సూర్యోదయమగు వరకును పట్టుగొమ్మై కరదీపికయై మార్గదర్శకమై కొంత మేరకైనను నూఱట గలిగించుగాక యను దలంపుతో సృష్ట్యాదినుండియు ఎందరో మహానుభావులు ఎంతెంతయో ప్రబల ప్రయత్నములు జేసి తమ తమ విజ్ఞానానుసారముగ మానవజాతియొక్క మనశ్శాంతికొరకై ఎన్నియో సిద్ధాంతముల నెలకొల్పియున్నారు.

1. జీవితకాల మంతయు ప్రకృతి (భౌతిక) శాస్త్రతత్త్వాన్వేషణమున గోల్పోయిన యొకండు మాతాపితరుల శుక్లశోణితముల వైషమ్యముల వలన గలిగిన మేధాది దైహిక మానసిక శక్తుల న్యూనాధిక్యములవలన జీవయాత్రానిర్వహణమున గలుగు లోపాలోపములే జీవుల సుఖదుఃఖముల వైషమ్యమునకు కారణములు గాని ఈశ్వర సంబంధ మెంతమాత్రము లేదు, ఇదియె నామతమనెను. (2) వేరొకడు శుక్లశోణితవ్యత్యాసాదులన్న దైహిక వైషమ్యములకు కారణము లగుటకే సమర్థములైన గావచ్చును గాని మానసిక వైషమ్యమున కసమర్థములు గాన ప్రసవకాలమందలి సూర్యాది గ్రహముల చారస్థితియే జీవుల సుఖదుఃఖముల వైషమ్యముల ముఖ్య కారణము. ఇదియె నాసమ్మతమనెను. (3) మరియొకడు మానవజీవితమునకు గ్రహచార సంబంధమును జూపుట ఆకసమునకు సోపానములు గట్ట జూచుట వంటిది. మానవు లెక్కడ? గ్రహతారక లెక్కడ? ఎట్టి సంబంధము? వట్టి పనికి మాలిన వెఱ్ఱియూహ, నిష్ప్రయోజకము. ఈశ్వరసృష్టి ఈశ్వర లీలారంగము "ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః" అన్నాడుగాదా వేదపురుషుడు. సుఖదుఃఖముల వైషమ్యమునకు నిర్హేతుక జాయమాన ఈశ్వరసృష్టి వైషమ్యమే కారణము. సర్వము ఈశ్వర కల్పాయత్తము అనెను (4) ఇతరు డొకడు, అంతేకాదు, హేత్వన్వేషణము ఈశ్వర తిరస్కారము, అపచారము, పాపకార్యము, నరకపాత హేతువు, భక్తుల కాగ్రహ కారణము గావున అట్టి ప్రసంగమే కూడని కార్యము అని భీతిబడియ కదలించుచు ననెను. (5) ఇదంతయు వినిన ఇంకొకండు ఇంత నిర్హేతుకజాయమాన సుఖదుఃఖ వైషమ్యమా! ఇంత జీవులయెడ కార్కశ్యమా! ఇంత క్రూరముగా జీవులయెడ ప్రవర్తించు నిరంకుశాధికారిని దయామయుం డగు ఈశ్వరుండని సంబోధించుటకంటె క్రూర రాక్షసుండనుటయె పొసగియుండునుగదా! ఇసీ! ఇట్లనుట కేవలము అజ్ఞానము. ఈశ్వర నిందయె యగును గాన ఇట్లనుట సరిగాదు. మానవవ్యక్తులు తా మనుభవించు సుఖదుఃఖములకు తామే యుత్తరవాదులు. తగినంత బాధ్యత దేనికది స్పష్టముగ గానవచ్చుట లేదే అని సంశయింపబనిలేదు. మానవుని కిప్పటి ఈజన్మము ప్రథమజన్మము గాదు. ఇంతకు పూర్వము ఇట్టి జన్మము లెన్నియేని గడచినవి. ఇంకను ముం దెన్నియో గడవనున్నవి. గడచిన జన్మములలో జరిగిన లోపాలోపఫలితములలో అనుభవింపగ మిగతపడియున్నవి ఈ జన్మమున స్థితిగతుల వైషమ్యరూపమున సుఖదుఃఖ వైషమ్యముల కారణములగుచున్నవిగాన మొత్తముమీద మీకష్ట సుఖములకు మీరే యుత్తరవాదులు. మీకు మీరే కారణములును కార్యములునుగాన ఒకరి ననవలసిన పనిలేదు అనిచెప్పి తన కింకను ఈశ్వరుడు మోక్ష మివ్వక పోయినను తాను మాత్రము మీశ్వరునకు లోకాపవాదము నుండి మోక్షమిప్పించితినిగదా యని సంతసించుచు ననెను.

వీరు చెప్పిన వన్నియును కొంతకొంత యాథార్థ్యమును గలిగియె యున్నవి. అన్నియును ఉపయోగకరములేను. ఒక్కొక దానివలన వేలకొలదియు, లక్షలకొలదియు, కోట్ల

కొలదియు, మానవులకు మనశ్శాంతి గలుగుచునేయున్నది. అయినను ఇంకను గొందరు మనశ్శాంతి కుదురక కొరవడి మిగులుచున్నారు. అట్టి వారు తమ మనంబున ఎరుగని యాళ్ళో మొరుగని కుక్క యన్నట్లు పూర్వజన్మములందలి అజ్ఞాతవిషయముల బాధ్యతయు తత్ఫలితమును తమ మెడకుబడి తమ స్వాతంత్ర్యమునకును స్వకృషిఫలితమునకును భంగము వాటిల్ల జేయుచున్నవిగదా యని వితర్కించుకొనుచుందురుగాన వారి మనము నుండి విచారము తొలగుటలేదు, మనశ్శాంతి గలుగుటలేదు. ఇట్లగుటయు సహజమే. ఒకానొకనికి సరిపడిన కవచమే ఎల్లరకును సరిపడకపోవచ్చును. అంతమాత్రముచేత దానిని పనికిమాలిన దనవచ్చునా? మరి పరిహార మేమి? వివిధదేహపరిమాణముల ననుసరించుటకై వివిధపరిమాణములుగల కవచము లుండి తీరవలయును. అట్లె ఒకరికి రుచించిన సిద్ధాంతము ఎల్లరకును రుచింపకపోవచ్చును. అంత మాత్రమున నయ్యది దూష్యమగునా? కానేరదు. మరి యేమన మనఃపరిపాకదశలును దైహిక పరిమాణదశలవలెనే అనంతములు గావున కవచము లనంతపరిమాణములు గలవిగ నుండవలసిన యట్లె మతములును సిద్ధాంతములును అనంతభేదములు గలవిగా నుండవలయు ననుటయు సమంజసముగనే యున్నది. "ప్రతిమునియును తన మతము గలిగియేయున్నాడు" అనియున్నదిగాదా వ్యాసోక్తి! (భారతము) ఇట్టి యథార్థము (తత్త్వము) బోధపడినవారికి సిద్ధాంతములయొక్క బహుత్వము కలవర కారణముగాదు. అచ్చెరువును గలిగింపబోదు. అట్టి వారి దృక్పథమున ఇంకను ఇట్టి సిద్ధాంతముల కెన్నింటికేని అవకాశమును ఆవశ్యకతయునుగలదు. అట్టిదృక్పథమున దృష్టి సారించుటచే గలుగు బుద్ధి తరగలపరంపరలలో నొకానొకటి కొందరికేని మనశ్శాంతిదాయక మగునేమోయను తలంపుతో నిందు పొందుపరుపబడుచున్నది. ఇయ్యది సుఖ దుఃఖ వైషమ్యనిరసనతత్త్వము లేక సుఖదుఃఖసామ్యతాసిద్ధాంత మనవచ్చును.

పై నుదాహరించిన సిద్ధాంతము లన్నియును మానవజాతియందు సుఖ దుఃఖ వైషమ్యమును స్వతఃసిద్ధముగ గొని దానిని సమర్థించుటకు పడరానిపాట్లు పడుచున్నవి. కాని ఈ సిద్ధాంతమున సుఖదుఃఖవైషమ్యమే సిద్ధింపదు. ఎట్లన సుఖ దుఃఖ కారకములు సాధారణముగ ఆధిభౌతికములు, ఆధిదైవికములు, ఆధ్యాత్మికములు అని యెన్నబడుచున్నవి. వీని ఫలితము ఎల్లరయందును ఒకేవిధముగ పరిణమించు నను తలంపుపై సుఖ దుఃఖ వైషమ్యతత్త్వము ఆధారపడియున్నది గాని యథార్థముగ వీని ఫలిత మెల్లరయందును ఒకేవిధముగ పరిణమించుటలేదు. కాన మానవులయందు గానవచ్చు సుఖ దుఃఖ భేదము దృష్టపరమేగాని ఎంతమాత్రమును భోక్తృపరముగాదు. ఏలయన ద్వంద్వాది వివిధవిషయములు ఎల్లరను ఒకేవిధముగ సుఖులనుగాగాని, దుఃఖితులనుగా గాని జేయుటలేదు.

1. ఒడ్డెరవాండ్రు కొందరు మండువేసవిని మట్టమధ్యాహ్న సమయమున కొండపైన బండ పగులుటకై చుట్టును నెగళ్ళు పెట్టి కాల్చి బండపగుల గొట్టుచు నుందురు.

ఇతర బీదజను లెందరో ఎండలలో అల్పవస్త్రులై బట్టబయల నుండియు మిక్కిలి వెక్కస పడుట లేదు. మరికొందరో నట్టింట నుండి సమస్త సౌకర్యములు గలిగి యుండియు నాప సోపములు కుడుచుచుండుటయు, కొందరు ఎండదెబ్బ పాలగు చుండుటయు జూచుచున్నాము గాదా! ఇట్లింట నుండి ఆపసోపములు గుడుచుచున్న వారిని ఒడ్డెరవానివలె కాలెను బండ పగులగొట్ట నియమించిన వెంటనే మృతుడై యుండుట సంభవించును. అల్పవస్త్రునిగ బయట ద్రిప్పిన వైద్యశాలకు చేరియుండును. ఇందుచే ఎండవేడి ఇంటనున్న వారిపై జూప గలిగిన సామర్థ్యమును ఒడ్డెరవానిపై గాని, అల్పవస్త్రులై తిరుగు బీదవారిపై గాని చూప గలిగి యుండిన ఒడ్డెరవాడు మృతుడై యుండవలయును. అల్పవస్త్రులగు బీదవారు వైద్య శాలకు జేరియుండ వలయును గాని యట్లగుట లేదు గావున ఎండ వేడిమి అందరిని ఒకే విధముగ బాధించుట లేదనుట స్పష్టము.

2. పుండువంటి చలికాలమున పలువురు అల్పవస్త్రు లయ్యును యథావిధిగ సంచ రించుచు తమ తమ పనులను చక్కబెట్టుకొనుచుందురు. ఎట్టియిబ్బందిని ననుభవించుట లేదు. మరికొందరు శాలువపై శాలువలు గప్పియు కుంపటిపట్ల నుండియు పెదవులు పగు లుట ఒడలు బీటలుపారుట మొదలుగాగల సంకటము లెన్నియేని యనుభవించుచుందురు. ఇట్లింటనుండియు చలికి బాధపడుచుండు వానిని ఆరుబయట నల్పవస్త్రునిగా ద్రిప్పిన చలి జ్వరము పాలబడును గాన చలికి ఇంట దాగియుండు వానిపై జూపగలిగిన సామర్థ్యమే ఆరుబయల దిరుగు అల్పవస్త్రులపై జూపుశక్తి యుండిన వారును రోగపీడితులై యుండవల యునుగాని యట్లగుటలేదు గావున శీత మందరిని ఒకేవిధముగ బాధించుట లేదనునది స్పష్టము.

3. ఒక యుద్యోగి అధికారినుండి వచ్చిన పల్లెత్తుమాట కోర్వలేక ఉద్యోగము నకు నీళ్ళు విడిచి పడరానిపాట్లు పడును. వేరొకడు దినలక్షుగ చీవాట్లు దినుచు ఉపకార వేతనమువరకును ఉద్యోగము జేయుచునే యుండును. అధికారి చీవాట్లు మొదటి యుద్యోగిపై జూపగలిగిన సామర్థ్యమునే రెండవ యుద్యోగిపై జూపగలిగినచో వాడును ఎన్నడో వెంటనే యుద్యోగమునకు నీళ్ళువిడిచి యుండును గాని యట్లు గాలేదు గనుకనే చీవాట్లు అందరిని ఒకే విధముగా బాధించుటలేదను విషయము స్పష్టము.

4. గోపురప్రాకారయుతంబులగు భవనంబులలో నుండియు నివేశస్థలము తగినది కాదనియో కట్టడములో లోపములు అనగా కిటికీలు, ద్వారములు ఉండవలసినచోట లేవనియో,ఉండవలసినన్ని లేవనియో,నదీతటాకాదులపై నుండి వచ్చుచల్లగాలి మార్గములో నున్నదనియో లేక సమీపములో నున్నదనియో ఏవియో కొన్ని లోపములు పలుమారు జబ్బుపడుటకు కారణములుగ నెన్నుకొని జీవితము యావజ్జీవన వేదనాకరముగ నున్నదని చింత పడుచుందురు. కొందఱ రేకద్వారకుటీరములలో నుండియు పరిపూర్ణపాటవముతో

జీవితము గడుపుచుందురు. గ్రామపరిసరములకును గృహనిర్మాణ వైఖరికిని రాజభవనములలోనుండు వారిపై గల సామర్థ్యమే ఏకద్వార కుటీరవాసులపై గలిగియుండిన వీరును సదా రోగులుగనే యుండవలయునుగాని యట్లగుటలేదు గాన పరిసరాదులకు ఎల్లరపై పరిసమానమగు సామర్థ్యము లేదనుట.

5. ఉన్నతములగు పరిశుభ్ర ప్రదేశములలో వసించుచుండియు దేహాగతమగు దౌర్బల్యదోషము వలననో సౌకుమార్యలోపమువలననో దీర్ఘజాడ్యము లనుభవించుచుండువారు కొందరుండ అపరిశుద్ధప్రదేశములలోను నిమ్నవాసములందును నుండియు ఆరోగ్యము ననుభవించువారును కొందరున్నారుగాన అపరిశుద్ధవాయు వందరిని ఒకేవిధముగ బాధించుటలేదు.

6. అత్యుత్తమవృత్తులలోనుండి అనారోగ్య మనుభవించువారు కొందరు గ్రామపారిశుద్ధ్య వృత్తులలోనుండియు ఆరోగ్యముగ నుండువారు మరికొందరు గానవచ్చుచున్నారు గాన అపరిశుద్ధ వృత్తు లందరను ఒకేవిధముగ బాధించుట లేదనుట విశదము.

7. ఒకానొకడు తలపై వ్రణమునకు శస్త్రవైద్యము జరుగుచుండ ఈలల వేయుచుండును. వేరొకడు ఉబ్బసమునకై చికిత్సగా రొమ్మున స్వంతముగా కదురులు కాల్చి వాతలు వేసికొనుచుండును. మరియొకడు కాలనాటిన ముల్లునాడ్చిన బాధ కోర్వజాలక గిజగిజలాడి పొరలాడి తుదకు మూర్ఛిలును. ముల్లు నాటినవానిపై వ్రణమునకును ఉబ్బసమునకును జరిగిన తీవ్ర చికిత్సయే జరిగియుండిన వాని పని యేమైయుండును. చికిత్స దెబ్బనుండి ఆరుమాసములకైన తేరుకొనియుండునా? కాని పై తీవ్రచికిత్సలు వ్రణమును ఉబ్బసమును గలవారినిగూడ ముల్లు నాటినవానివలెనే లొంగదీయ గలిగినచో వారును ముల్లు నాటినవాని దుస్థితికే వచ్చియుండవలయును గాని యట్లుకాలేదు గావున తీవ్ర చికిత్స అందరిని ఒకేవిధముగ బాధించుట లేదు.

8. ధనము సేకరించుచుండియు నిధినిండుట లేదని కృశించుచుండువారు కొందరుండ నిత్యశ్రీనిత్యమంగళముగ కాలము గడుపుచు సంతోషముగ నుండువారు మరికొందరు ఉందురు గాన కలిమిలేములు ఎల్లరను ఒకేవిధముగ బాధించుట లేదు. ఇవి కొన్ని యుపలక్షణార్థము. ఇతరము లూహ్యములు.

ఇంతేకాదు, కలిమిలేములు రోగారోగములు, బలాబలములు వ్యాధిస్వాస్థ్యాదులు, కామక్రోధాదులు మొదలగు వానికి సంబంధించిన స్థితిగతులభేదములు కేవలము తాము సుఖదుఃఖవైషమ్యమునకు కారణములు గాకపోవుటయేగాక సుఖదుఃఖ సమీకరణమునకు తోడ్పడుటచే సుఖదుఃఖ సామ్యతా కారణములుగ గూడ నగుచున్నవి. ఇట్లనుట సాహసకార్యముగ దోచినదోచవచ్చును గాని సత్యదూర మెంతమాత్రమును గాదు. ఎట్లన:

1. కమ్మతగాడు కావలికై పొలమువద్ద నారుబయట కంబళిసహాయముననో దుప్పటి సహాయముననో కాలము గడుపును. భూస్వామియో శిరోగృహముననో గర్భగృహముననో శాలువ దిగదీసి నిద్రించును. ఇట్లయ్యును కమ్మతగాడు ఉదయమున సకాలముగ మేల్కాంచి దినచర్య కుపక్రమించును. భూస్వామియన్ననో కాలాతీతముగ మేల్కాంచియు శీతబాధను ఒడలి నొప్పులను గూర్చి ప్రసంగించ వలసిన వాడగును. భూస్వామి దేహసౌకుమార్యగుణవిశేషము గర్భగృహశయనమువలని సుఖమును పెంచ నివ్వలేదు. శీతబాధవలని దుఃఖమును తరుగ నివ్వలేదు. కమ్మతగాని దైహికాసౌకుమార్యమే వాని కంబళి సుఖమును తగ్గనివ్వ లేదు. శీతబాధ దుఃఖమును హెచ్చనివ్వ లేదు.

2. కాంచనపాత్రియందు కలమాన్నము భుజించువానికి వలెనే కాంస్యపాత్రియందు కలియంబళులు గ్రోలువానికిని కడుపునిండిన సౌఖ్యము కలుగుచునే యున్నది. కలమాన్నము భుజించువానికి షడ్రసములలో నొక్కరసము తక్కువపడినప్పుడును మనమున కంటగించుకొనుచున్నాడు. కాంచనపాత్ర మా దుఃఖమును తొలగింపగాని,తగ్గింపగాని సమర్థముగాలేదు. కలియంబళులు త్రాగువాని కన్ననో కారమునకు దోడు మరియొక యనుపానము తోడ్పడినయంతనె యానందపరవశు డగుచున్నాడు. కాంస్యపాత్ర యాయానందమును తొలగించుటగాని దాని భంగము గలిగించుటగాని లేదు. మానసిక సౌకుమార్యాది విశేషములవలన గలుగు సమీకరణాది ఫలితములకు పూర్వోక్త ఉదాహరణములేగాక యనుభవమునం దెన్నియో జూడనగును, జూపవచ్చునుగాన ప్రతివ్యక్తి జీవితమునను సుఖదుఃఖముల సాధకబాధక సంపత్తియు తత్సమీకరణ మార్గములును నుండితీరు ననుట తెల్లమగుచున్నది. యథార్థమేమన నెట్టిభిన్నభిన్నస్థితిగతులలో నున్న వారలకైనను మానవుల కందరకును సుఖదుఃఖానుభవములును తదవకాశములును సామాన్యములు. అట్లే సుఖదుఃఖ సాధక బాధకములును తత్సమీకరణ భంగులు నసామాన్యములు. కృషిస్వాతంత్ర్యము తత్ఫలార్జన యత్నములును ఎల్లరకును సామాన్యములుగాన సుఖదుఃఖావకాశములు తత్సామ్యతా కారణభంగులును ఎల్లరకును సామాన్యములు.

ఇక స్థితిగతుల భేదము లెట్లు సార్థకము లనవచ్చును? ఈస్థితిగతులు దేశకాలవస్తుపరిచ్ఛేదరీత్యా సుఖదుఃఖావకాశములను, తత్సాధకబాధకములను, భిన్నభిన్నస్వరూపములుగ మార్పగలుగునేగాని సాధ్యమగు సుఖదుఃఖముల కీ భేదము సంక్రమింపజాలదు.

ఒకానొకని జీవితమున సుఖావకాశములు అధికముగ నున్నట్లు గానవచ్చినను అందు కనుస్యూతములై దుఃఖావకాశములును అధికముగనే యుండును. దీని విపరీతస్థితి యందును ఇట్లే యూహింపనగును. దుఃఖావచ్ఛిన్నముగాని సుఖముగాని సుఖావచ్ఛిన్నముగాని దుఃఖముగాని ఏరికిని అసంభవము గావున పరిస్థితుల భేదమునుబట్టి యొకరి జీవితము మరియొకరికి దుఃఖతరముగనో దుఃఖతమముగనో లేక సుఖతరముగనో సుఖతమముగనో

గాన్పించినను అట్టి సుఖదుఃఖవైషమ్యము స్థూలదృష్టికి దూరపుకొండల నునుపువలెనో అథవా భూతద్దములోని దృష్టికి (సూక్ష్మదర్శనయంత్రములోని దృష్టికి) దోచువస్తువుల అతిమాత్రనిమ్నోన్నతములవలెనో భ్రాంతిజనితమైన విపరీతభావన యనియే తెలియ వలయును.

ఇట్టి యాథార్థ్యము నిదర్శనపూర్వకముగ మానవహృదయమున నచ్చొత్తుటయే కృతికర్త యాశయము.

ఇట్టి తత్త్వ మలవడమియే సంసార సాగరమున భ్రాంతిమూలకమైన అసూయా సంతుష్టి జనితములైన యెన్నియో దుఃఖతరంగములకు కారణమనియు ఈ తత్త్వము సుబోధమై యలవడినచో అట్టిదుఃఖతరంగము లెగయక మానవకోటి మనశ్శాంతి కెంతయో యభివృద్ధి సమకూరుననియు దృఢవిశ్వాసము. వేయేల! హఠాత్సిద్ధముగ ఒకరిస్థితిగతులు మానసిక దైహిక విశేషములతోసహా మరియొకరికి సంక్రమించినను వారి సుఖ దుఃఖాను భవమునం దంతగా మార్పుండ దనుటయే సారాంశము.



# ప్రబోధము

### శ్రీ చక్కా కోటివీరయ్యగారు

ఆర్యహృదులయందు నల పంచగురువులు, శివలింగములు బ్రతిష్ఠించునాఁడు
ఆశ్రమంబుల నగస్త్యాదులు తమతమ, పేర్ల మూర్తులను స్థాపించునాఁడు
కేదారగురువులకే జనమేజయుం, డిల దానముగ వ్రాసియిచ్చునాఁడు
కల్యాణపురి నిత్యకల్యాణముగ మహే, శ్వరుల గణార్చనల్ జరుగునాఁడు
వీరశైవుల కెంత యభేద్యమైన, కార్యదీక్షాపరిస్ఫూర్తి గ్రాలుచుండె
నా మహావేశ మర్థించి యాంధ్రవీర,శైవులార! మహోన్నత శక్తి మెఱయఁ
జల్లు డక్షతలను వీరశైవమునకు.

తన సువాఙ్మయ సుధాధారలు జగతిని, బ్రవియింపఁజేసిన శైవవాణి
తన తపోమహిమఁ గాంతార గోత్రగ్రామ, సమితి దీపించిన శైవశక్తి
తన యోగశక్తిని జనములందున వ్యాప్తి, గావించి మించిన శైవగరిమ
తన భక్తితరగల ననయంబు ప్రాణుల, స్నానమాడించిన శైవజలధి
అస్మదీయ మనోవీథి నావహింప, జ్ఞాపకమొనర్తు శ్రీవీరశైవ బుధుల
సమధికమ్మగు లింగపూజా మహమ్ము, మరల నొకసారి మనలోన మెఱయుటకును.

# జగత్ప్రళయమగునా?

(కాలజ్ఞుడు)

సామాన్యముగ పుట్టినవన్నియు గిట్టుచునుండుటబట్టి "జాతస్య మరణం ధ్రువం" అను సూక్తి పుట్టియుండును. ప్రపంచమందలివస్తువు లన్నియు నాశమునో లేక మరొక విధమైన పరిణామమునో పొందుచుండుటవలన ప్రపంచముకూడ నొకప్పుడు అత్యంతనాశము పొందునా? ఏ భూతములు లేకుండ బైలులో గలిసి శూన్యమగునా అను విచారము బుద్ధిమంతులగువా రందరియెదుటను వచ్చుచునేయున్నది. గొప్పగొప్పఋషులు, ఆచార్యులునుగూడ నీ విషయమున నేకాభిప్రాయము గలవారుగా లేరు. జగత్తును సత్య మని యొకరు సిద్ధాంతింపగా మరియొకరు అసత్య మనియే భేరీనినాదము గావించిరి. ఇం కొకరు సత్యాసత్యమని సమన్వయము బైటబెట్టిరి. దీనినిగురించియే శివభక్తశిఖామణి, గంధర్వకులభూషణుడు, పుష్పదంతాచార్యుడు ఇట్లు వివరించెను:

"ధ్రువం కశ్చి త్సర్వం సకల మపర స్త్వధ్రువ మిదం
పరో ధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతి వ్యస్తవిషయే
సమస్తేఽప్యేతస్మిన్ పురమథన! తై ర్విస్మిత ఇవ
స్తువన్ జిహ్రేమి త్వా నఖలు నను ధృష్టా ముఖరతా.

అట్టి మహామహులే జగద్విషయమున ఒక సిద్ధాంతము తేల్చనపుడు మనము మూకీభావము వహించుటయే మంచిదేమొ? ప్రస్తుతము జగత్ప్రళయములోని ఒక భాగమును మాత్రమే ఊహించుకొనుటకు ప్రయత్నింతము.

జగత్తుయొక్క సృష్టి స్థితి లయములు సహజము లనియే చిరకాలమునుండి మన పెద్దలు వచించుచు వచ్చిరి. మనకును అట్టి సంస్కారమును కలిగియున్నది. కాని అతి దీర్ఘకాలమునుండి ఒకే విధముగ సూర్యచంద్రులు, నక్షత్రములు, జలవాయువులు, ఒకే రకముగ ఉద్భవించుచు తమ తమ కర్తవ్యములను సరిగ సకాలమున నిర్వర్తించుచున్నవి కావున ఇవి నాశమగునని ఎవరేని చెప్పుచో ఆశ్చర్యము కలుగకమానదు. కాని కొంత సూక్ష్మముగ విచారింపుచో పూర్వమువలె ఎండ నీడ చలివానలు పుష్కలముగ వచ్చుట లేదు. పాడిపంటలు, ఆయురారోగ్యములు సరిగ నున్నట్లు నమ్మకము ఎవరికిని లేదు. నా బాల్యమునకును ఇప్పటికిని భేదము గన్పట్టుచున్నది. ఇక పెద్దపెద్దవారి అనుభవములను గూర్చి వ్రాయవలసిన యంశములు మిక్కిలిగా కలవు. ఇవి యిట్లుండగా కొందరు కలిసమాప్తి బొందుననియును, గొప్పమార్పు గలుగుననియును భావించుచున్నారు. ఇట్టి సంగతులను ఊహించుటకైనను ఈవ్యాసము కొంత తోడ్పడునేమో యని ప్రయత్నింపబడినది.

ఈ ప్రపంచమందలి సమస్త జీవులయొక్క సృష్టి; సూర్యునివలన లభించు ఉష్ణమును, ప్రకాశములనుబట్టి యగుచుండు నను విషయమును మొదలు జ్ఞాపకముసం దడుకొనవలెను. సంవత్సరము వెనుక సంవత్సరము గడిచిపోవుచుండును. ఈ జగద్వ్యవహార మంతయు చాల సులభముగ సాగుచున్న ట్లుండును. కాని వీని కన్నిటికి సూర్యప్రకాశమే ఉత్సాహమును, జీవమును ఒదిగించుచు ముందుకు నెట్టుచుండును. ఏకారణమువలన నైనను సూర్యకాంతి యొక్క ప్రసరణమునందు హెచ్చుతగ్గులు గలుగుచో దాని ననుసరించియే జగల్లీలలు సన్నగిలునని తెలియదగును. అనగా సూర్యుడు కనుపడనినాడు జగత్తునకు దుర్దినము! (మేఘచ్ఛన్నేహ్ని దుర్దినం—అమరః) సూర్యుడు లేనినాడు జగత్తులేదు. ఇది అసలు కథ.

ప్రత్యహము సూర్యునినుండి మనకు లభించుచున్న ఉష్ణత ఎప్పటికిని ఇట్లే లభించు ననుట కల్లమాట. అగ్గిపుల్ల, దీపము, కొరకాసు, కుంపటితొట్టి మున్నగు వానిలోని కాక ఎప్పటికి ఒకేతీరుగా నుండక వానిలోనుండు సామగ్రి యొక్క బాగోగులపై యాధారపడి యుండు ననుట మనకు బాగుగా తెలియును. కుంపటికిని సూర్యునకును సామ్యము లేని మాట నిజమే కాని సూర్యుడుకూడ ఒక పెద్ద భట్టివలె ఏపదార్థములనో నిరంతరము తనలో గాల్చుకొనుచు వెలుగుచుండవచ్చు ననుటలో సందేహములేదు. మనమామూలు వంటచెఱకు లచట లేకపోవచ్చును, కొరివి మాత్రము మనదే! సూర్యుని కాక కొంత కాలమునకు తగ్గు ననుటకు కారణ మేమి టంటే: ఆయన బైలరు (భట్టి) లో బైటినుండి రాతిబొగ్గుగాని కట్టెలనుగాని వేయువారు లేరు. స్వయముగా తనయంతస్సత్త్వము నుండియే యా వెలుగును ఉష్ణతను ఒదిగించుచున్నాడు? అట్లు ఎంతకాలము చేయగలడు? ఆ యుష్ణతో త్పాదకములగు దిమ్మెలు కొంత కాలమువరకు మాత్రమే పనిచేసి తిన్నగా అరిగి పోవచ్చును. కనుకనే మొదటివలె ఎండలు కొన్ని ప్రదేశములలో తగ్గిన వనుచున్నారు. ప్రతి దినమును సూర్యుని బరువులోనుండి ౩౬.౦౦౦ కోట్ల టన్నుల తూకము తగ్గిపోవుచున్నదట. అందువల్లనే కాబోలు హిల్లను మున్నగు మహానుభావులు కోట్లటన్నుల ఉష్ణపుబాంబులను సృష్టించి పుడమి కందించుచున్నారు. ఈ ౩౬.౦౦౦ సంఖ్య చూచుటకు మనకు చాల గొప్పదిగా తోచును. కాని మొత్తము సూర్యుని తూకములో నిది పిలప్పిలాయమాన మని కూడ చెప్పవచ్చును. అంటే సూర్యరశ్మి శక్తి దినదినము తగ్గుచున్నను మనము దానిని ఒకటి, రెండు, పది, వంద వేయి సంవత్సరములలో తారతమ్యముగా గురుతించ లేము. కొన్ని వేల లక్షల సంవత్సరములలో మాత్రమే విజ్ఞాన వేత్తలు సూర్యుని బలాబలములను కనిపెట్టగలరు. సూర్యు డిపుడే పదిరోజులలో చల్లపడు ననికాని, "చేతావని" లో గీచినట్లు ముందు శ్రావణములో సూర్యుడు కొత్తబడునని కాని భావింప నక్కరలేదు.

కోటానుకోట్ల ఏడులు గడచినట్లు సూర్యుడు తగ్గుననుకొనుడు. సూర్యుని గతిలోగూడ మాంద్యము కలిగి వంద వత్సరములలో పృథ్వికి ఇప్పటికంటె మూడడుగులుదూరము జరిగి వెనుకకు పోవుచుండునని శాస్త్రజ్ఞు లనుచున్నారు. సూర్యుడు వెచ్చగా నున్న

సంగతి నందఱెరుంగుదురు. కాని పృథ్వియందలి అపారమగు జలరాశికి అనగా చల్లదనమునకును, వర్షము ఇచ్చుటకును కారణమై యున్నాడనుట చాల కొలది జనము మాత్రమే యెరుగుదురు. ఇది కొంత సూక్ష్మమైన విషయము కావున దురూహాముగ నుండును. కాని మన పెద్దల కాలమునాటికంటె ప్రస్తుతము వానలు పాడిపంటలు తగ్గినది ప్రత్యక్షమే కావున ఈ భూశక్తివలెనే పంచభూతములలో నొకటగు అగ్నిశక్తికూడ అనగా సూర్యుని కిరణప్రసారణ తరుగుచున్న దనుటకు సందేహ మేమి? సూర్యుడు చల్లబడుచుండుటయు, బరువు తగ్గుచుండుటయు సామాన్యముగ నూహింపదగినవి కావు కాని, అసంభవమైన విషయమేమియు కాదు. కొంత తెలివితో లెక్క వేయుచో తెలిసికొనవచ్చును.

ప్రస్తుతము మహాపద్మ (10, 12/0) సంవత్సరానంతర మే మగునో ఊహించినచో కొన్ని పరిస్థితులను మనము తెలిసికొనగలము. అంటే ఇంతటి దీర్ఘకాలమునాడు పృథ్వీ సూర్యుల మధ్య నుండెడు అంతరము నేటికంటె ఒకటింబదిపాళ్ళు ఎక్కువ కాగలదు. అనగా సూర్యుడు పృథ్వికంటె నింకను చాల దూరము వెళ్ళగలడనుట నిక్కువము. పృథ్విలోని వారికి ఉష్ణతగూడ తక్కువగా లభించుననియు దెలియవలయును. (ఇక ప్రస్తుతము శీతదేశములలో నున్నవారు అప్పటికిగూడ నక్కడనే మాతృభూమి యను భ్రమతో నున్నచో గడ్డగట్టి మంచులో గలిసి పోగలరు. తెలివిగలవారు క్రమముగా తమశీత దేశముల వదలి పరదేశముల ప్రవేశించి యచ్చటివారికి వస్తువ్యాపారసౌకర్యము గలిగించి శాంతిలో బడవైచి యా యా రాజ్యముల నాక్రమింతురు. ఇది పశ్చిమ దేశస్థులకు సహజము. భారతదేశము, ఎప్పుడైనను ఇతర దేశములకంటె ఎక్కువ ఉష్ణముగనే యుండగలదు కావున ఇక్కడ వారు మఱెక్కడికిని వలస వెళ్ళనవసర ముండదు.) ఇదే సమయమున సూర్యుని తూకము నూటికి అరవవంతు తగ్గిపోగలదు. ఈ రెంటియొక్క పరిణామముగా సూర్యుని యుష్ణత ఇప్పటికంటె షుమారు 30° శతాంశము (Centigrade) లేక 84° ఫారన్‌హీటున తగ్గగలదు.

ఇంతగా ఉష్ణత సన్నగిలిన తరువాత మనుష్యుడు జీవించక తక్షణమే నశించునని భావన గలుగును కాని అప్పటి మనుష్యునిలోను ఉష్ణత ఎక్కువగా నుండును కావున మన మనుకొనినంత త్వరగా కాక కొంతకాలము తరువాతనైనను వినాశము నొందగలడు. వెనుకటివారి దేహము శీతముగా నుండెడిది కావున నారింజకాయలు వాడుచో శైత్యము వచ్చునని భావించిరి. నేడు కొంచెమించుమించు అందరిలోను ఉష్ణత ఎక్కువగ నుండబట్టియును, కాకరోగములు విశేషము కావునను నారింజపండ్లు మున్నగు శీతల పదార్థముల సేవన యెక్కువైనది. ఆ సమయమున నేడు ప్రత్యేకముగ గనుపడు చల్లని హిమాలయము భూమితోగూడ చేరుకొని ఏకాకారము కాగలదు. జలమయములైన సముద్రములన్నియు అప్పటికే పట్టి మంచుగడ్డలుగా నుండగలవు. వనములతోడను పుష్పములతోడను

పచ్చగను రంగురంగులుగను గన్పడు ఈ ప్రకృతి నామశేషముగ మాత్రి ముండగలదు. ఇక పువ్వులతావిని దడవనేల ? అట్టి సమయమున మానవుడు బ్రదికియుండుచో ఆ మానవుడు మహావిజ్ఞానము గలవాడై యుండు ననుటలో సందేహములేదు. కాని ప్రకృతి యను పెద్దపులి వానిని బ్రదుక నిచ్చునా ?

ఇది మహాపద్మ సంవత్సరములనాటి సంగతి. సామాన్యముగ ఒక కోటి యనగా నేమియో తెలియని వారికి పద్మ మాశ్చర్య జనకముగదా ! సరిగా ౫౦౦౦౦౦ ల సంవత్సరములు ఒక అంగుళమని భావించి మహాపద్మ వత్సరపు లెక్కను దేల్చుటకు ప్రయత్నించుచో ముప్పదియొక్క మైలున్నర (౩౧½) పొడవుగా నది గన్పట్ట గలదు. మనుష్యుడు పుట్టి పదిలక్షల వత్సరము లని వేసిన యంచన సూర్యగతిలో రెండు అంగుళములని మాత్రమే తెలియవలెను. ఈ రెండు అంగుళముల గమనముననే మనుష్యుని యౌన్నత్య మింత యద్భుతముగ నున్నపుడు ముప్పదియొక్క మైళ్ళు గతించిన ఆ యద్భుత కాలమున నెట్లుండునో ! ఇది యొక నిగూఢమైన యద్భుత కల్పన. ౭, ౫ వందల సంవత్సరములలో మానవుడు యాంత్రికుడై యాకాశమున దిరుగుచున్నాడు. నేటి గమనము చాల తీవ్రమైనది. ఇట్లే ప్రగతి జరుగుచుండుచో ఒక వేయి వత్సరములలో మన మూహింపజాలని వాడుగ మానవుడు సిద్ధము కాగలడు. ఇక లక్షలు గడిచి మహాపద్మమువరకు జేరిన వాని చర్యలు ఊహాతీతము లనుటలో సందియ మేమి ? కాని అంతవరకు మనుష్యుడు బ్రదుక గలడా ? ఇంతపొడవు లెక్క నూరక ఊహించితిమే కాని ఈ లోపుగ పృథ్విలో నెన్నిచమత్కారములు, దుర్ఘటనలు కలుగునో ! చరాచరములు, జీవజంతువులు, ప్రజలు ప్రభుత్వములు అడుగంటునో, గతానుభవమునుబట్టి యూహించుకొనవచ్చును.

సూర్యుడు మరొక తనవంటి నక్షత్రముతోగాని, లేక మరొకనక్షత్రము సూర్యుని లోనికిగాని సంఘర్షణగా కలిసికొనిరా సూర్యునికిని పృథ్వికిని గల ప్రదక్షిణ వ్యాసము అద్భుతముగా మారిపోగలదు. నేటి అక్షాంశములలో మహాంతరము పెద్ద గండివంటిది యేర్పడగలదు. మన యనుభవములోనున్న ఈవేల వత్సరములలోను పృథ్వీగమనము ఎప్పటి కప్పుడు మారుచున్నను మనము సూర్యుడు పుట్టినచోటును ఒక కొండ గురుతుతో తూర్పుగా భావించినాము. కావున ఎప్పటికిని అది యట్లేయని సామాన్య లోకమున ప్రచారమై యున్నది. కాని దాని పరివర్తనలోని యాథార్థ్యము దెలిసినపుడు చిత్తము కొంత తత్తరపడుననుట సత్యము.

కొన్నిచుక్కలు అకస్మాత్తుగా మండుచు పొడవై మరొకచోటికి వెళ్లుచు మరలసన్నగా మారి యొకచోట నిలిచిపోవుటయో లేక భస్మమైపోవుటయో మనము గాంచుచున్నాము. వీటి విషయములో శాస్త్రజ్ఞులు నవనక్షత్రము లని (Nava) వ్యవహరించుచున్నారు. ఈ నవీకరణములో కొన్నిచుక్కలవలె యొక పెద్ద చుక్కయే యైన సూర్యుడుకూడ మండిపడి

కదలెనా ఎక్కువగా ప్రకాశించెనా ఇంక నేమున్నది? ఒక్కక్షణములో పృథ్వి యంతయు దహించి బూడిదయై రూపుమాయగలదు. ఇంక మనగతి? ఆ నువ్వులోని యొక పరమాణు రేణువు! ఈ పుడమి యంతయు నొక్కని పిడికిలిలో నుండగలదు. అసలు లెక్కప్రకారము మొన్న 1937 అక్టోబరు నెలలో 'హార్మ్స' అను పెద్ద చుక్క పృథ్వికి మిక్కిలి సమీపముగా (౪౦౦౦౦౦ మైళ్ల దగ్గరగ) మందుచు వచ్చి పడిపోయినపుడు పృథ్విలోని కొంత భాగము నమసి పోవలసి యుండెను. కాని 1931-32 లో వచ్చిన భూకంపము కొంతవరకు దానిని సరిచేసినది. కావున మనకు దానికొడ దూరమై పోయినది. పై పరిమాణము చంద్రునికి భూమికి మధ్యనున్న యంతరముతో కొంత సరిపోవుచున్నది. ఆ చుక్కలోని దావాగ్నికి నాల్గులక్షల మైళ్లుకూడ మిక్కిలి దగ్గర యన్నపుడు దాని వికటభయంకరాకారమును ఈ బాంబులయుగమున సహజముగ బోల్చుకొనవచ్చును. ఆగ్రహము గంటకు డెబ్బదివేల మైళ్ల వేగమున నడిచి ఆరుగంటలలో మనయిలు జేరెడిదట. దాని వెడల్పు ఒక మైలట! ఇది మన దేశపు సముద్రములో బడినపుడు పోయెడి వాళ్లు పోగా ఉన్నవాళ్లయినను కొన్ని వేల వత్సరముల వరకు కట్టెల ఖర్చు లేకుండ వేడినీళ్లు లభించియుండును. అనేక ద్వీపములు పుట్టి గిట్టియుండును. అప్పటికైనను మన భారత దేశమునకు స్వరాజ్య పరిపాలనను గూర్చిన యోగ్యతాపత్రము దొరకెడిదో లేదో!

ఇట్టి యుల్కాపాతములనుగూర్చి మన జ్యోతిశ్శాస్త్రమున (అద్భుత సాగరాది గ్రంథములలో) గ్రహకూటమనియో విషమగ్రహసమ్మేళనమనియో యనేక విధముల జెప్పియున్నారు. ఇట్టి వన్ని గ్రహణాదులవలె యనిష్టసూచకము లనియును అపుడు స్నాన జపతపాదుల నొనర్పవలె ననియు పెద్దలు నిర్ణయించిరి. అందరేకముఖముగ నట్లు ప్రార్థనలు సలుపుటలో నొక యద్భుతము ఏదైనను కలిగెడు నేమో! ఇప్పటి తెలివిగల వారి కెవ్వరి కెవరు దెల్పవలెను? 1908 లో సైబేరియా దేశమున ఉల్కాపాతము జరిగినపుడు కొన్ని యడవులు మేఘాచ్ఛన్నములై పాడై పోయెనట! అక్కడ మనుష్యుల సంఖ్య తక్కువకావున సరిపోయినదికాని, మన దేశమువలె దట్టముగా నున్నచో కొన్నికోట్లమంది బలియయ్యెడువారు.

చూచుటకు చంద్రుడు చల్లనివాడైనను ఇకముందు మనకు ముప్పుదెచ్చువాడు వీడేనట! అందుకనియే కాబోలు వీని భవిష్యాపకీర్తి కళంకముగా నిప్పుడే నెలకొనినది. అయితే, ఈ పని ఇంకను లక్షలు కోట్ల వత్సరముల తరువాత జరుగునదికావున ఇప్పటి నుండియే చంద్రుని దీవింప నక్కరలేదు. అప్పటి పృథ్విలో నేదో యొక మనోవైకల్యము గలిగి ఈ గడబిడలో విరేచనముల పాలగునేమో? దీని కడుపు మండ, చంద్రుని తనవైపు చలువకొరకు లాగుకొనుచు అసలు సన్నిపాతము బుట్టి బుడిగ్గు మనునా? ఈ పుడమి యెన్ని ముక్కలుగా చీలిపోవునో? సలిల మెక్కడ పడునో, అనల మెక్కడంటునో?

చర్చిలు (చర్చిల్) ఏడనో, హృదయము (హిట్లరు) ఏడనో ఇప్పు డెవరు దెల్పగలరు. మా యిల్లు అపుడే భూతలమున నుండునో మాధన మేడ నుండునో యని ఇపుడు మలయాయుద్ధ పోరు లను కొనుచున్నటులు, అపుడు మహాపృథ్విలోని మానవు లందరును మాట్లాడుటకైనను అవకాశము దొరకునా?

జగత్ప్రళయము ఇంకను మిక్కిలి దూరమున గలదు. ఇది పుట్టి రెండు అబ్జముల వత్సరములేనట! ఇంకను ఎనిమిదవ వత్సరము వచ్చినపుడుగదా కన్యాదానము? పెళ్లియైన చాలకాలము నాటికే గదా పిల్లలు గలిగి పంపకములకై యుద్ధ మొనర్చి మడియుట? ఎందుకైనను భగవన్నామసంకీర్తన మనెడు దివ్యశక్తి పనికిరాదా! జగత్ప్రళయమైనను జగదీశ్వరభక్తునికి చలనము లేదు. ఏ మనియెదరు?

# మా దా త లు

సదాశివ పేటనివాసులు, సుప్రసిద్ధ శ్రీమంతులు శ్రీ కుద్దాల బుచ్చప్పగారు రు౧౧౬లతో సన్మానించి 'విభూతి'కి రాజపోషకత్వము నంగీకరించినారు. వీరు 'విభూతి'కిని 'విభూతి'సంపాదకులకును చిరకాలమునుండి ప్రోత్సాహ స్తంభమువలె నున్నారు. ముందును వీరి యాశ్రయము స్థిరముగ నుండగలదు. మరియు శ్రీమునిపల్లి మఠము సంగయ్యగారు, రు ౨౫ లచే మిక్కిలి యౌదార్యముతో సర్పించి ప్రోత్సాహించినారు. వీరు సదాశివ పేటకు అలంకార ప్రాయులు, స్వమతాభిమానులు. శ్రీమఠ్రి బక్కన్నగారును వారి పుత్రులు మర్రి వీరసంగప్పగారును రు ౫లను ప్రథమదక్షిణగా సమర్పించి ప్రాచీన వ్రాతప్రతులగు ద్విపద బసవ పురాణమును కొలనుపాక మాహాత్మ్యము అను గ్రంథముల నొసంగి మున్ముందొక గ్రంథమును నచ్చువేయింపగల మని వాగ్దానము గావించిరి. వీరు గొప్పగురుదేవతా భక్తులు.

దేవరపల్లి నివాసులు శ్రీ కుంకులగుంట వీరయ్యగారు శివదీక్షాసమయమున భూరి దక్షిణలతోడను, నూతన వస్త్రములతోడను సన్మానించిరి. వైద్యవర్యులు శ్రీ చిమిరాల చంద్రశేఖరయ్యగారు ౫౦ రులను వాగ్దానము గావించి 'విభూతి'కి సహాయకులై మొదటి దఫా ౧౦ రుల నొసంగినారు. వీరు గొప్ప మతాభిమానులు. శ్రీ కుంకులగుంట కోటయ్యగారి కుమారుడు సంగయ్యగారు తమ పాతవాగ్దానము బాపతు ౪ రులను చెల్లించిరి. పరిమిగ్రామ నివాసులు శ్రీ బెళగిన కోటినాగయ్యగారు ౨౫ రులను మిక్కిలి యుదారతతో నిచ్చి తమ పూర్వవాగ్దానమును సార్థకపరచిరి.

వీ రందరికిని పరమేశ్వరుడు ఆయురారోగ్యభాగ్యముల నొసంగుగాక!

# రా మా య ణ వి శే ష ము లు

ఈ వ్యాసము మొదలు హైదరాబాదు ఆంధ్రుల విజ్ఞానాభివర్ధనీ పరిషత్తులో శ్రీ సు. ప్రతాపరెడ్డి గారిచే చదువబడినదను ముఖ్యసూచనను పాఠకులు గమనింప ప్రార్థన.

